## గోలకొండవాచకములు

(అవసరాల అనంతమూర్తి)

ఈమధ్య మాపిల్లలకు గోలకొండవాచకములు కావలసి సికిందరాబాదులోని వేంకటరామ కంపెనీకి వెళ్లితిని. సికిందరాబాదులో ఉపయోగమునిమిత్తం ఒకసెట్టును, నిజాంరాష్ట్రపాఠశాలలలో ఉపయోగించేనిమిత్తంఇంకొకసెట్టును కలవనివారుచెప్పిరి. ఈరెండుసెట్టులలో ఏమి భేదమున్నదో చూడవలెనని రెండుసెట్టులనుకొని పరీక్షించితిని. నాకుకనుపించినభేదములను ఈక్రింద వివరించుచున్నాము.

మొదటివాచకము.

సికిందరాబాదుప్రతి.

1. వెండితోగిన్నెలుచేయుదురు 2. ఇత్తడితో పాత్రలుచేయుదురు 3. తమలపాకులు కాడలు కట్టిఅమ్ముదురు 4. మూత్యములకోవ 5. కానుల పేరు 6 గేదె 7. పసులవాడు 8. పిల్లా! 9. గురువారము

హైద్రాబాదుప్రతి.

1 వెండితో తళ్లెలుచేయుదురు2ఇత్తడితోబాసాములుచేయుదురు3తమలపాకులు కట్టలుకట్టిఅమ్ముదురు4ముత్యములదండ5కానులదండ6బర్రె7పసులపోరడు 8 పోరీ! 9 బేస్తవారము

ఇటువంటికేమార్పులు కనుపించుచున్నవి. హైద్రాబాదుప్రతిలో రెడుమూడు అధికపాఠములు కనుపించినవి, "ఎలుక-పాము"అనే అధికపాఠములోను, "తేనెబొట్టు"అను అధికపాఠములోను గ్రామ్యపదములు మిక్కుటముగానున్నవి.

రెండవవాచకము.

సికిందరాబాదుప్రతి,

1. తేగకు 2, తొందరగ 3. గడ్డిపోచలు 4. అవులేగ 5. విడిచిపెట్టెను 6. మిఠాయిఅంగడి 7 పళ్లెము 8. ఇంద్రసేనప్ప

హైదరాబాదుప్రతి.

1 దూడకు2బిరాన3గడ్డిపరకలు4అవుదూడ5విడిచి పుచ్చెను 6 మిఠాయిదుకాణము 7 తాంబాళము సింగిణి 8

మూడవవాచకము.

సికిందరాబాదుప్రతి.

1 మనదేశము 2 హైదరాబాదుసంస్థానము 3 పాఠశాలలు

హైద్రాబాదుప్రతి

1 మనరాజ్యము2హైదరాబాదురాజ్యము3విద్యాలయములు

ఈవిధముగా ప్రతివాచకములోను ఏవోకొన్ని మార్పులు కనబడుచున్నవి. ఈమార్పుల సమంజసత్వము పత్రికాపాఠకులే చూచుకొనవచ్చును. ఏదోనియమముగా మార్పుచేయుటయే ప్రధానముగా ఉద్దేశించినట్లు కనబడినది. పెక్కుమార్పులలో గ్రామ్యపదములు, మాండలికములు కనుపించినవి

ఇక హైద్రాబాదుప్రతిలో అధికముగానున్న విషయములను కొన్నిటిని ఉదాహరించుచున్నాను

రెండవవాచకము:-సూర్యునిచుట్టుభూమితోపాటుతక్కిన ఎనిమిదిగ్రహములు తిరుగుచు ఉండును. (సూర్యుడు, భూమి క ఎనిమిది గ్రహములు ఎచ్చటనుండివచ్చెను?

మూడవవాచకము:- బసవేశ్వరుడుపండితారాధ్యుడుఇచ్చటనే జన్మించిరి. (ఇదిచారిత్రకమా!)

2 జామేనుసీదు (మక్కామసీదు) (ఇవిరెండును ఒకటియేనా? )

నాల్గవవాచకము:- నిజాముల్ ముల్కు దక్కన్ సుబేదారు (ఈ ఎందుకు)

ఐదవవాచకము:- మహాఘనతవహించిన అసఫిజాహీరాజ్యమునకు (ఈబిరుదు మనప్రభువుగారికా లేక అసఫిజాహీరాజ్యమునకా?)

2. సిరిసంపదలయందును మహాఘనతయందును హైదరాబాదు భారతదేశమున మహానగరములలో మొదటిదిగా బరిగణింపబడుచున్నది. (కలకత్తాబొంబాయిల గతిఏమి)

3. నేడు మహాప్రతిభావంతులై మహాఘనతవహించిన మన అలాహజరతు మీర్ ఉస్మాన్ అలీఖాన్ (పధీవరేణ్యులు ధర్మసింహాసనమెక్కియున్న పవిత్రస్థానము. ఈవాక్యము "భూచా"తప్పకుండా మూడవతరగతి భూగోళపుస్తకములోనుంగ్రహింపబడినది)

4. శ్రీచారుచర్య-ఓ. న. (శ్రీ ఎందుకు. ఈపద్యములు మిక్కిలి పేలవముగ కొన్నిచోట్ల అపభ్రంశములుగనున్నవి ఈ ఓ-న గారు ఎవరు? ఇంతకంటె మంచిపద్యములు దొరకలేదా?

సికిందరాబాదు హైదరాబాదు ప్రతులను పోల్చినప్పుడు గ్రంథపరిమాణములో ఈక్రింది భేదములున్నవి.

| సికిందరాబాదుప్రతి, | హైదరాబాదుప్రతి |
|---|---|
| రెండవ 92 పేజీలు | 84 పేజీలు |
| మూడవ 114 | 97 |
| నాల్గవ 138 | 111 |
| ఐదవ 155 | 124 |

గోలకొండవాచకములు మొదట ముద్రింపబడినప్రతులనుకూడా జూచుట తటస్థించినది. సికిందరాబాదుప్రతులు మొదటిముద్రణమునకు ఇంచుమించుగా సరిగానున్నవి. మొదటిముద్రణ ప్రతులలోనున్న కొన్నిముఖ్యపాఠములు హైదరాబాదుప్రతులలో తొలగింపబడినవి.

ఉదా:- రబ్బరు, గుజ్జము, కాగుడుమూతలు, మామిడిచెట్టు గడియారము (ఆత్మకథ)బసవేశ్వరుడు, సీసెనాలు, వీరేశలింగంపంతులు, కవిచక్రవర్తి కాళిదాసు, పరపతిసంఘములు, వీరబలుడు, అరణ్యములు, పర్వతములు,లక్కపరిశ్రమ విజయనగరము తిక్కనసోమయాజి చీరాలేశము,పైపాఠములలో పెక్కులువిద్యార్థులకుముఖ్యమైనవి. పరపతిసంఘములనుగురించి పాఠములుండవలెనని విద్యాశాఖవారు నిర్బంధించుదురు, విజ్ఞానబోధకములను ఆంధ్రమహాపురుషులనుగూర్చినవియును పాఠములను తొలగించవలసిన కారణము లేమో?

పైగ్నవిషయములను పరిశీలించినప్పుడు ఈ మార్పులకు ఏదోప్రత్యేక కారణమున్నట్లు కనుపించుచున్నది. గ్రంథకర్తలుగాని, ప్రకాశకులుగాని, ప్రభుత్వ వారుగాని ఈరహస్యమును బైలుపెట్టుదురా?

## శ్రీరామానుజాచార్యులు ఆంధ్రులు కారు

"శ్రీరామానుజాచార్యులు ఆంధ్రులు"అను శీర్షికతో గోలకొండపత్రికయందు వెలువడిన వ్యాసమునుచూచినవారిపై రామానుజాచార్యులాంధ్రులాయని వ్రాసిపుంటిని అంతుకు శ్రీ-ఉ-వే-శ్రీమాన్ గో- రమాకాంతాచార్యులవారు నా వ్యాసమును విమర్శించుచు, శ్రీరామానుజాచార్యులు ఆంధ్రులేయనియు ఆరవదేశమున బ్రాహ్మణులే గాక చండాలపర్యంతము ద్రావిడులేయనియు ఇట్లువ్రాసినవిమర్శన వ్యాసము వృషసంక్రాంతి ౧౫ సోమవారం గోలకొండపత్రికయందు ప్రకటించబడినది. దానికినాకుతోచినరీతిగా సమాధానముబ్రాయుచున్నాను, సమబుద్ధితో సారము గహించగలరనిమనవి.

శ్రీ గో- రమాకాంతాచార్యులవారి ఉపవ్యాసమునుచూడలేదు, గోలకొండ పత్రికయందు ప్రకటించబడినంతవరకే తెలియును.

ఐతిహాసికదృష్టిచే శ్రీరామానుజాచార్యులు ఆంధ్రులని నిరూపించితినని సెలవిచ్చినారు ఐతిహాసికదృష్టి యనగా నెట్టిది?

శ్రీభాష్యమును తిరుమల శ్రీనివాసమూర్తికి కృతియిచ్చినారని నేనువ్రాసిన వ్యాసమునందు లేదు-

శ్రీరామానుజులవారు ద్రావిడులుగానందునే ద్రావిడప్రబంధములు పాడించలేదనివ్రాసినవానికి సంస్కృతమున గద్యత్రయాదులు సాధించినంతమాత్రమున ద్రావిడత్వమునకు హానిగలుగదనివ్రాసినాను. "సంస్కృతస్యయథాసంతి ద్రావిడస్యాపిభూతశే"యను ప్రమాణము యామునాచార్యుల పు ఉభయవేదాంత ప్రవర్తకులందరికి ద్రావిడసంస్కృతములుసమానమే, ద్రావిడులుమాత్రమేకాభిమానమువలన ద్రావిడభాషకాధిక్యతకల్పింతురనుమాట తటస్థించదు.

శ్రీరామానుజాచార్యులవారు ద్రావిడులని క్రొత్తగాననుటలేదు- గురుపరంపరాప్రాప్తమగు మాటయే"ద్రావిడేషువిశేషేణప్రభవిష్యంతమూరయః తిగ్మదండమండితో దేవోమునిఃప్రాదుర్భవిష్యతి"యని ద్రావిడదేశంబున శ్రీరామానుజులవారవతరించినటుల పెక్కు ప్రమాణములున్నవి విన్నవారికానుట భగవద్రామానుజాచార్యులాంధ్రులాయనివ్రాయుట విమర్శకాచార్యులవారి కొరకు మామునకుకొరకైనది ద్రావిడదేశంబుననున్న బ్రాహ్మణులాదిగా చండాలపర్యంతము ద్రావిడులే యని తలనముగానిరసించుట కడువిచారముగానున్నది.

శ్రీరామానుజులవారిపూర్వులు, కృష్ణా-గోదావరి- గుంటూరునెల్లూరుజిల్లాలప్రాంతమునుండి దక్షిణముగా వలసపోయినారనివ్రాసినారు ప్రమాణమున్న విశ్వసించవచ్చును-

ద్రావిడదేశమునుండి ఆంధ్రదేశమునకువచ్చిన ఆరవశ్రీవైష్ణవులు కొందరు ఆంధ్రదేశమందుండియు, ఏదోవిధముగా అరవసంబంధముండుటచే తెనుగుగడ్డయందుబుట్టిన శ్రీవైష్ణవులకంటె తామెక్కువయని చాటుచాటున చెప్పుకొనెదరని వ్రాసినారు- చాటుమాటలు చాటుమాటలే. చాటుమాటలు ఆచార్యులవారి కెటులదెలిసియుండును. అప్రత్యక్షమగుదానినెరుగు విద్యావిశేషమేదైనయుండవచ్చును. రామానుజీయ శ్రీవైష్ణవులందరు గౌరవనీయులేయని, ద్రావిడులెనదరు- ద్రావిడులైనను ఆంధ్రులైనను భగవద్రామానుజ సంబంధులందరుపూజనీయులే-కాగనువారెవరు? బ్రాహ్మణత్వ వైష్ణవత్వమున్న దేశముల వారికొకటైనను వారివారి ఆచారములవలన ద్రావిడులు, ఆంధ్రులు- ఉత్తరదేశీయులను భేదమేదేశమునందున్నను తెలియుచున్నది-

శ్రీరామానుజాచార్యులాంధ్రులు. ఆంధ్రులా? ఆంధ్రులే, యనువిచారమింతటితో ముగించి యథాపూర్వముగా భక్తివిశ్వాసము లుండుటయే స్వరూపానురూపము-

ఇట్లు
తిరుమలనల్లాన్ చక్రవర్తి వెంకట
వరదాచార్యులు

## ఆంధ్రనాటక కళాపరిషత్తు ౧౧వ సమావేశము

"కవితాకళానిధి" శ్రీబలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారికి షష్టిపూర్తి సన్మానోత్సవం

రాబోవుడిసెంబరు ౨౮, ౨౯, ౩౦, తేదీలలో జరుగబోవు ఆంధ్రనాటక కళాపరిషత్తు ౧౧వ సమావేశముసందర్భమున హరిశ్చంద్ర, బుద్ధిమతీవిలాసాద్యనేకనాటక గ్రంథకర్తలును, స్వయముగ పేరుమిగిలినసటులును, కవితాకళానిధి బిరుదాంకితులును, అగు శ్రీబలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారికి షష్టిపూర్తి సన్మానోత్సవము జరుపుటకు నిశ్చయింపబడినది.

ఈసన్మానాన్ని తగురీతిగజరపడానికి సుప్రసిద్ధ సినిమాడైరక్టర్లగు శ్రీసి-పుల్లయ్యగారి ఆధ్యక్షతను, శ్రీబందా కనకలింగేశ్వరరావుగారు అంక కామేశ్వరరావుగారు, భాగవతుల సుబ్బయ్యశాస్త్రిగారు, గిడుగుసీతాపతిగారు, పింజమూర్తి, రంగాచారిగారు, బొమ్మలగడ్డ సత్యనారాయణమూర్తిగార్లతో ఒకఉపసంఘము ఏర్పడినసన్మానసంఘంవారు ఉత్సాహంగాపనిచేస్తున్నారు

శ్రీకవితాకళానిధిగారియెడల భక్తిగౌరవాభిమానములుగల ఆంధ్రమహాశయులకు అందరకు యీయుత్సవంలో అవకాశం లభింపజేయబడుతుంది. అట్టివారుఅభిమానపురస్సరముగా పంపదలచుకొన్నపద్యాలుగాని, పారితోషికాలుగాని తదితరవిరాళములుగాని! కార్యదర్శి ఆంధ్రనాటక కళాపరిషత్తు ౧/౧౦ నల్లమ్మ మొదలి లేన్ రాయపేట మద్రాసుకుపంపినయెడల సన్మానసందర్భమున శ్రీలక్ష్మీకాంతకవిగారికి అవితం అందజేయబడతాయి. ఆంధ్రమహాశయులందరూ యీఉత్సవంలోపాల్గొంటూరని ఆశిస్తాను.

కొత్తపల్లిలక్ష్మయ్య
కార్యదర్శి

## చిరుతపులి భయము

లక్ష్మీపురము, ౯-౨-౧౩౫౧ ఫ.

ఈ గ్రామము నిరిసిల్లకు అతిసమీపమునగలదు. ఈ గ్రామసమీపమున పెద్దపెద్దగట్లు గలవు- ఈ గట్లలో పెక్కు- అడవిమృగములుగలవు- అందులో రైతులకునష్టము, కష్టముకలిగించే ఎలుగుబంట్లు, తోడేళ్లు, చిరుతపులులుగూడ ఈగట్లలో గలవు-ఎలుగుబంట్లు ఎల్లప్పుడు ప్రయాణీకులను భయకంపితులుగ జేయుచునేయున్నవి- తోడేళ్లు మందపైబడి, గొర్లను, మేకలను చంపి తినుచునేయున్నవి.

మొన్న మాగ్రామనివాసిఅగు ఒకబీదరైతుయొక్క- ఏబదిరూపాయీల విలువగల ఎద్దును చిరుతపులి చంపితినెను-పాపమీరైతు మొన్నటివరకు తండ్రి చేసినఋణము తీర్చితీర్చి రెండెడ్లు కొని వ్యవసాయము సాగించుకొనెను. ఈరైతు వునాసపైనవల్ల నిరాశ జెంది, మిరపతోటలమీదనైన సాహుకారి బాకీ చెల్లించెదనని ఆశపడుచుండగా మోటనడిపే ఎద్దును పులితినివేసెను-గతవత్సరము మాఆవులు దామెరమీద యుండగా ఒకదూడను ఇదేపులి చంపితినెను.

ఎల్లప్పుడు రైతులపశువులను ఈపులిచంపుచు తినుచుండును. ఈచిరుతపులివల్ల రైతులకు ప్రాణధననష్టము వాటిల్లుచున్నది. ఎవరైనా ఈపులి వేటకైవచ్చిన చో చాలసహాయముచేయగలను- నా రైతుసోదరులందరు సహాయముచేయగలరు_వేటలో రుచిగలఅధికారులు అతిశీఘ్రముగా ఏతెంచి మాసహాయముగైకొని వారియభిమతము పూర్తిచేసుకొని మాకష్టములను బాపెదరుగాక!

యస్, భూపతిరెడ్డి రైతు.

## వైదిక ధర్మప్రచారము

[స్వ.వి.] సదాశివపేట, నవంబరు౧౧

తేదిలో సదాశివపేట ఆర్యసమాజమువారి పక్షమున బన్సీలాల్ వ్యాసు పండితులవారు జాతరసమయములో మంగళవారంరాత్రి ౯గంట లనుండి యక్షిణీదీపముద్వారా వీరులమహాపకారములు వీరులచరిత్రలుచూపించి భజనోపదేశములు గావించిరి-వచ్చినజనము సుమారు ౧౫౦౦మంది. స్థానికులగు రాజాశివజ రావుగారు తమ దేవాలయములోనే స్థానమిచ్చి పండితులవారికి అకర సత్కారములు గావించిరి.

బన్సీలాలువ్యాసుగారు సదాశివపేటకు ౧౩ నవంబరుఉదయము వెంచేసి అనాడురాత్రి పండితులవారు బజారులోఉండిన శిరిపురంవారి బాడాలో తమభజనోపదేశములను యక్షిణీదీపముద్వారా చిత్రపటములు చూపించిరి. మరుసటిదినము అట్లే ప్రచారముగావించిరి.

### ప్రచారమునకు రామమందిరంలో స్థానములేదు

ఇక్కడి ఆర్యసమాజమంత్రిగారు యక్షిణీదీపముద్వారా వైదికధర్మప్రచారము రామమందిరములోగావింపవలెనని ఏర్పాటుచేసి గ్రామములో సర్వులకు తెలిపిరి. అట్లే సనాతనధర్మ ఉపాధ్యక్షులగు శ్రీమాదిశెట్టివీరయ్యగుప్తగారికిని తెల్పిరి-సరేయని శ్రీవారుసమ్మతించి అస్పృశ్యులకొరకుఎట్లుఅనిఅడిగిరి_అట్టిశంకకుమంత్రిగారు సమాధానముచెప్పి వారినిరాకుండచేసెదమనిరి_అట్లాయినసరేయనిరి. రాత్రి౯గంటలకుఏర్పాటుచేయబడియుండెను. ౮౺ గంటలకు సనాతనధర్మసభా కార్యదర్శిబచ్చువెంకటేశ్వరగుప్తగారు దగ్గరకూర్చుండిన ఉపాధ్యక్షులగు శ్రీమాదిశెట్టివీరయ్యగారు సమాజమంత్రినిపిలిచి ఉక్తపండితులవారి ప్రచారము రామమందిరములో కూడదని సెలవిచ్చిరి. అందుకుమంత్రిగారు "ఏమండీ అసలు సమయములో ఇట్లువిఘ్నముచేయుదురా, కారణమేమియనియడిగిరి. "కారణమేమీలేదు. కారణమడుగపనిలేదు, తమకుమాత్రం తావొసగబడ" దని స్పష్టంగాచెప్పిరి_అందుకు మంత్రిగారు సరేయనివెళ్లిరి మంత్రివారు బజారులోవుండిన శిరిపురంవారిబాడాలో సభచేసిరి.

### ఖమ్మంమెట్టు కమ్మవిద్యార్థి వసతిగృహము

(ఒకవిలేఖరి)

ఈనెల ౧౩వతేదీని, విద్యాశాఖప్రత్యేకతనిఖీ-ఆఫీసర్ గారగు శ్రీఅలీఅక్బరుగారు, ఖమ్మంమెట్టు హైస్కూలుతనిఖీకైవిచ్చేసిన సందర్భమున, ఇచ్చటికమ్మవిద్యార్థివసతిగృహమునకు దయచేసి, వసతిగృహనిర్మాణనిర్వహణములనుగూర్చి మెక్కలిగప్రశంసించిరి-

## అలంపూరు తాలూకా రైతుల మొర

### ఎన్నడులేని క్షామం

(ఈక్రిందివార్తను అలంపూరు తాలూకాలోని రైతులు ౭౫ మందిసంతకములు ఆగస్తములు చేసి మాకు ప్రకటనార్థము పంపియున్నారు- గో_ప)

మొత్తం హైద్రాబాదురాష్ట్రములో అలంపూరుతాలూకాయే చిన్న తాలూకా కాని అంతపన్నిచ్చే తాలూకా యింకొకటిలేదు. ఈతాలూకారైతుల విశేషమేమనగా నేటివరకెన్నడున్నూ ఏగ్రామరైతులుకూడా పన్నులబకాయిపడలేదు. కిస్తులు అన్యతాలూకాలలో ౧౫ వతేదివరకుకూడా సరిగావసూలుకాకుంటే మాతాలూకాలో ౫ వతేదీవరకేబాకీశేషం డావసూలుఅయిపోతుంది.ఇంకోవిశేషమేమంటే మాతాలూకాభూముల హైసీయతునకుమించి పన్నుఅధికారముచూపినారు- మాభూములతో కర్నూలుజిల్లాభూములు ౫ గ్రామములలోకలిసియున్నవి- మానంబర్లప్రక్కనఉండే పైయిరుగ్రామములలోని భూములపన్ను సగటుపై ఎకరా ౧౨ అణాలుంటే మానంబర్లకు ౧-౮-౦ రూ॥ పన్నుతగిలించినారు. మరియితరగ్రామాలలో మూడుమూడున్నర నాలుగురూపాయలవరకుకూడా ఒక్కొక్క ఎకరాపైపన్నులను చూపినారు- ఇట్టితాలూకాలోఈయేడుకష్టమంటాగా సంభవించినది_ అలంపూరుగ్రామముజిల్లాపురము పుట్లూరు కోనేరుబంటిర_౫గ్రామాలలో సగము పునాసపంటపండినవి- మిగతాగ్రామాలలో ఆ అణాలుకూడాపండలేదు- పసులకు మేతలకకూడా తగినంతగడ్డికూడపండలేదు- చొప్పకూడ ఏమిన్నిలేదు- భూములెచ్చలుకూడ మంచిపదును కాలేదు- రబ్బీవిత్తనంకేస్తే మల్లీవర్షమేలేదు- మొలకలు వాడుబట్టుచున్నవి- ఇకమీద ఒకటిరెండువానలుపడిన రబ్బీపండుతు రబ్బీకథరబ్బీపన్నులకుముందు తెలుస్తుందికాని పునాసలో రైతులకష్టంపోయెను. విత్తనంనష్టమయ్యెను. ఈతాలూకాలో జీతగాండ్రజీతాలు చాలాయెక్కువ. వ్యవహారమంతయు కల్లాయలోనే- ప్రక్కనవుండే దేవరప్పర్తి, సాలమూరుతాలూకాలలో ఇచ్చేజీతాలకంటె రెండంతలజీతాలు ఇచ్చుచున్నారు- కూలీలుకూడా రెండంతలకూలీలు. ఈవిధంగాఖర్చు లెక్కువ అదాయమేమిన్ని లేకపోయెను. ఎన్నడును మాఫీలుఅడుగని యీతాలూకా యీయేడుదేహీఅని అడుగవలసివచ్చినది- ప్రభుత్వమువారు ఏటేట తెలంగాణారైతులకు మాఫీలు ఇచ్చుచువచ్చినారు_ మాకట్టిఅనుగ్రహాలు ఇదివరలోఎన్నడును ఇచ్చియుండలేదు. కావున మేము వినయతతో దయామయులగు ప్రభుత్వమువారిని ఈసంవత్సరంమాకు పునాసపన్నులమాఫీ యివ్యవలెననిప్రార్థించుచున్నాము- మేముతకావీలుకూడాఅడుగలేము. ఎన్నడును సర్కారుఖజానాకు నష్టంచేయనట్టి యీబీదరైతులమొరను ప్రభుత్వంవారు ఆదరిస్తారని మాతాలూకాజిల్లాఅధికారులకు మాయందనుగ్రహముకలిగి మాపై సానుభూతిచూపింతురని ప్రార్థించుచున్నాము-

అలంపూరు తాలూకారైతులు.

## వెట్టినిగురించి ప్రబోధము

ఆంధ్రమహాసభ ఆర్గనైజింగు సెక్రెటరీగారు ఇట్లు తెలుపుచున్నారు.

"నిజాంరాష్ట్ర ఆంధ్ర మహాసభాధ్యక్షులగు శ్రీ రావి నారాయణరెడ్డిగారు హైద్రాబాదు జిల్లాసంఘకార్య కారిణిసభ్యులు కా॥ సేడ్ పయ్యదుతిలం, ఆంధ్రమహాసభ స్థాయిసంఘఆర్గనైజింగు సెక్రటరీవట్టికోట ఆళ్వారుస్వామిగార్లతో ౧౩దై ౧౩౫౧ సోమవారమునాడు తాండూరు (గుల్బర్గా) కు సమీపమునగల పెద్దేముల గ్రామవాసుల ఆహ్వానముపై వెళ్లిరి- ఈగ్రామములో నిప్రజాసేవకులు కొన్నాళ్లనుండి ఆంధ్రమహాసభవారి వెట్టిచాకిరీ పుస్తకముల ద్వారా గ్రామములందు ప్రచారముగావించిరి, తత్ఫలితముగ వేగారివారిలోకొంత చైతన్యముకలిగెను.ప్రతిఫలరహితముగ వెట్టిచేయనిరాకరించిరి,"

ఉచితము

ఇదివరలో 0-8-0 ధరగల

అఖండమాలా

భగవద్గీత

తాత్పర్య సహితము

వలయువారు 2 అణాల తపాలబిళ్ళలు దిగువఅడ్రసుకు పంపండి.

మేనేజరు

గోలకొండ పత్రిక హైద్రాబాదు ద.

# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర మార్గశిర శు॥ ౩
సోమవారము


# విద్యా పద్మవ్యూహము

3

మన విద్యావిధానములో ప్రాథమిక, మాధ్యమిక, కళాశాలా విద్యలను మూడుదర్జాలున్నవి. ఈమూడింటిలో ప్రాథమిక విద్యయందుతప్ప తక్కిన రెండింటిలో ఉర్దూకే ప్రాధాన్యత కలదు. ప్రాథమికవిద్యలోకూడా కొన్ని మార్పు లవసరమున్నవి. ఈ మూడింటిలో ముల్కీ-భాషలవారు తృప్తిపడునట్లుగాను, ఉర్దూ ఏవిధముగా వృద్ధిపొందుచున్నదో అదేవిధముగా ముల్కీ-భాషలును వృద్ధిపొందునట్లుగాను, ఉర్దూ కేవిధమగు ప్రభుత్వావలంబనమున్నదో అదేవిధముగా ముల్కీ-భాషలకును ప్రభుత్వావలంబన ముండునట్లుగాను ఒకవిధానమును అందరికీని తృప్తి కలిగించురీతిగా ఏర్పాటుచేయుటకు వీలులేదా? ప్రభుత్వము వారును హిందూ ముస్లిములలో విద్యావమస్యల నెరిగినవారును గట్టిప్రయత్నముచేసితే ఇది దుస్సాధ్యమైనదిగా ఉండజాలదు. ఇప్పుడు రాష్ట్రములోని విద్యాపద్ధతిని స్థూలముగా చర్చింతుము.

ప్రాథమికవిద్యలో అయిదు తరగతులున్నవి-ఒకటి బాలశిక్షయొక్క తరగతి. తక్కినవి నాలుగు తరగతులు. నాల్గవ తరగతితో ప్రాథమికవిద్య పూర్తియగును-ఈతరగతులలో "స్థానిక భాషలోనే విద్య చెప్పింపబడును. ఉర్దూ మాతృభాష కలవారికి ఉర్దూ చెప్పింపబడును. సాధారణముగా స్థానికభాషలోను ఉర్దూభాషలోను వేరువేరు తరగతులు ప్రాథమిక పాఠశాలలో ఉండును." అని ప్రాథమిక పాఠశాలల విద్యాక్రమము (కరికులం) లో వ్రాసినారు-ఇదిమంచిపద్ధతి. దీనిలో మాకేమియును ఆక్షేపణములేదు- అల్పసంఖ్యాకులుగా ఉన్న ఉర్దూవారికి ప్రత్యేకమైనతరగతులను పెట్టుటలో మాకావంతయు ఆక్షేపణములేదు. అట్టిచో అధిక సంఖ్యాకులగు ముల్కీ-భాషలవారి బాలబాలికలకు తమతమ మాతృభాషలలోనే విద్యచెప్పించు విషయములో ఎవ్వరికిని ఆక్షేపణముండకూడదు.

అయితే ఓంనమశ్శివాయఅని మొదలుపెట్టినప్పటినుండియే చిక్కులు ప్రారంభముగుచున్నవి. ప్రైమరీవరకు చదివిన విద్యతోనే చాలించుకొని పోవువారికొరకు ఎక్కువతరగతిని అక్కడక్కడ ఏర్పాటు చేతుమన్నారు-అదినరికాదు. ప్రతిప్రైమరీతరగతిలోకూడ ఎక్కువతరగతి ఉండవలెను. నాల్గవతరగతి విద్యార్థులను నాల్గవ తరగతిచేరునప్పుడే విచారించవలెను-మీరు ముందు మాధ్యమిక తరగతులలో చదువనున్నారా? లేక ప్రైమరీతో చాలించుకొనువారా?" ప్రైమరీతో చాలించుకొనువారైన వారిని ఎక్కువతరగతిలోచేర్చి వారి మాతృభాషలోనే విద్య చెప్పించి పంపివేయవలెను-అటుకానివారి విషయములోనే యిక చిక్కు లుండును.

ప్రైమరీలో మాతృభాషలోనే విద్య నేర్చుకొన్న ముల్కీ-భాషలవారు మాధ్యమిక పాఠశాలలోని ౫వతరగతిని చేరగానే అచ్చట ముల్కీ-భాష నూయమగుచున్నది- అంతయు ఉర్దూలో ప్రారంభమగుచున్నది. మొదటి ఐదేండ్లు ఉర్దూలోనే చదివి ఉర్దూను మాతృభాషగా కలిగియున్న ఉర్దూబాలురతో పోటీగా ఉర్దూలోని అలిఫ్బేలైనా తెలియని ముల్కీ-భాషా బాలురు ఏమిచేయగలరు? దీనినిగమనించియే ప్రాథమిక తరగతులలో కొన్ని మార్పులు చేయవలసివచ్చినది. అదేమనగా బాలశిక్ష (ఇన్ ఫెంట్) ౧,౨తరగతులు చాలవరకు (as a rule) ఏకభాషాతరగతులుగా ఉండుననియు, ఇంగ్లీషు ౩వ తరగతిలో ప్రారంభమగుననియు వ్రాసినారు. రెండవ తరగతిలో మాతృభాష కాక ఒకఎక్కువభాష తీసుకొనితీరవలెను. అనగా ముల్కీ- భాషలవారు ఉర్దూను ౨వతరగతిలో ఎక్కువభాషగా నేర్చుకొనవలెను. ఉర్దూ మాతృభాష కలవారికిని ౨వతరగతిలో ఒక ఎక్కువభాష నేర్పాటుచేసినారు. వారు తెనుగు, మరాఠీ, కన్నడములలో, ఏదైనఒక భాషను నేర్చుకోవలెను. కానిముందు మాధ్యమిక తరగతులలో చేరదలచినవారికి ఫార్సీ భాషను తీసుకొనుటకు సెలవియ్యబడును. అంటే సాధారణముగా ముస్లిం బాలుడు ఫార్సీనే తీసికొని తమ ఉర్దూకు పుష్టిని కలిగించుకొందురు. దానివలన ఉర్దూబాలురపై భారమేమియునుండదు. ఇక ముల్కీ-భాషల బాలురు తమమాతృభాషను, ఓనమాలతరగతి, ఒకటవ తరగతిలో నేర్చుకొన్నతర్వాత రెండవ తరగతిలోనే అన్యభాషయగు ఉర్దూను నేర్చుకొనితీరవలెను. అంతేకాదు-మూడవతరగతికి వచ్చేవరకు ఇంగ్లీషునుకూడా మరొక అధికభాషగా తీసుకొనితీరవలెను. ఈవిధముగా మూడవతరగతిలోని ముల్కీ-భాషా బాలురు ద్విభాషీలుకాక త్రిభాషీలు అగుచున్నారు.

ఇక మాధ్యమిక పాఠశాలలనుగురించి తెలుసుకొందము. మాధ్యమిక పాఠశాలలలో అయిదునుండి ఎనిమిదవతరగతివరకు నాలుగు తరగతులుండును. వానిని లోయర్ సెకండరీ పాఠశాలలందురు. మరియు హైయర్ సెకండరీపాఠశాలలలో ౯,౧౦,౧౧ అను మూడుతరగతులుండును.దానితో ఉన్నతవిద్యపూర్తి అగును.

లోయర్ సెకండరీలో విద్యఅంతయు ఉర్దూలో చెప్పింపబడును- బాలికలకు ఉర్దూలో కాని లేక ముల్కీ-భాషలలో కాని చదువుచెప్పింపబడును. ముల్కీ- భాషలలో అయితే ఉర్దూను స్వంతద్వితీయ భాషగా చెప్పించితీరవలెను. హైయర్ సెకండరీలో బాలికలకు బాలురకును అందరికిని కేవలము ఉర్దూలోనే విద్య చెప్పింపబడును. ఉర్దూకే ప్రాధాన్యత ఉండుట చేత లోయర్ నుండి హైయర్ కు వెళ్లు బాలురకు ఇంగ్లీషు సహజముగా బాగా రాకుండాఉండును. అందుచేత ప్రత్యేకం ఇంగ్లీషుకొరకుగాను లోయర్ తర్వాతఒక ఏడాదిపాటు విద్యచెప్పించి అందులోకడతేరినవారిని హైయర్ లోతీసుకొందురట.

లోయర్ లో వారానికి ౨౨ గంటల కాలములో చదువు చెప్పింతురు. అందు ౬ గంటలకాలములో ఇంగ్లీషును, ౫గంటలకాలములో ఒక ముల్కీ-భాషను లేక అరబీ, ఫార్సీ, సంస్కృత భాషలలో ఒక భాషనుగాగాని నేర్పింతురు. మిగత ౧౧ గంటలకాలములో ఉర్దూలో పాఠముల నేర్పింతురు. ముల్కీ-లేక ప్రాచీనభాషలకు ఏర్పాటుచేసిన ౫గంటలకాలము చాలతక్కువ. పైగా ఈభాషలలో పరీక్ష అన్నమాటలేదు. బాలురు పరీక్షలేని పాఠాలను ఎంత ముద్దుగా చదువుదురో అది అనుభవైకవేద్యము. ఈ ప్రణాళిక పట్టణాలలోని బళ్లలోవర్తించును. పల్లెలలోనిబళ్లలో కించిద్భేదమున్నది-దీనిని బట్టి ముల్కీ-భాషలకు లోయర్ తరగతులలో స్థానములేదని తెలియరాగలదు.

ప్రైమరీలో అంతయు మాతృభాషలోనే విద్యచెప్పించుటకు అవకాశాలులేవని రెండవ తరగతిలో ఉర్దూ, మూడవ తరగతిలో ఇంగ్లీషు ప్రవేశపెట్టుట వలన స్పష్టమగుచున్నది. మరి క్రిందితరగతులలో ద్వితీయభాషగా ఉర్దూను ఇంగ్లీషును చదివినవారు లోయర్ లో తటాలున ౧౧గంటల ఉర్దూను చదువుచు ఉర్దూ మాతృభాషకలవారితోపాటు చదువుట మానవబాలురకు సాధ్యమగుపనికాదు. ముల్కీ-భాషలవారికి ఉర్దూ ఇంగ్లీషు అను అధికభాషల భారమున్నది. ఆ భారమును ౧౧ గంటల వరకు ప్రతివారము మోయవలెను. ఉర్దూవారికి ఒక ఇంగ్లీషుభారము మాత్రమే యున్నది. ఆ భారమును వారములో ౬గంటలకాలము మాత్రమే మోయవలెను- మరి ప్రైమరీ తర్వాత ఇంచుమించు ముల్కీ- భాషలకు స్థానమే లేకపోయెను- ఈవిధానము కొద్దిమార్పులతో బాలికలకునువిధించబడియున్నది. ఇదిమరింతకష్టమైనభారమైపోవుచున్నది.

ఇటీవల లోయర్ హైయర్ సెకండరీ బళ్ళన్నియు ఉర్దూ ప్రధానమైనబళ్ళుగానే మారిపోవునని ప్రభుత్వమువారు ఆజ్ఞాపించియున్నారు. ఈవిధానము హిందూ సమాజములును క్రైస్తవ సమాజములును- ఆక్షేపించియున్నవి-ఈ విధానమువలన కొన్నిఏండ్ల తర్వాత ఇంగ్లీషునకు నేయగుస్థాన ముండదు- నిజాము కాలేజీకి అప్పుడు అవసరముండదు- బయటి విద్యాపీఠములలో మన ఉర్దూ గ్రాజుయేట్లను తీసుకొందురోలేదో? మరియు బయటికళాశాలలలో మన ఉర్దూ హైయర్ సెకండరీ విద్యార్థులను తీసుకొను నమ్మకముండదు. సహజముగా మన ఉస్మానియా విద్యార్థులు ఇంగ్లీషులో చాలా బలహీనులగుదురు- బలహీనులైతే చింతలేదుకాని ముల్కీ- భాషలవారు తుదకు తమ ముల్కీ-భాషలలో ఏవిధమగు ప్రాథమిక పాండిత్యమును లేనివారై తమ భాషాసోదరుల నుదరించజాలనివారై యుందురు- మరి ముల్కీ-భాషలవారికి ఉర్దూఅయినను బాగాపట్టునా అంటే అదియునులేదు- ప్రైమరీలో ఏకొద్దిరోజో ఉర్దునేర్చి సెకండరీబళ్లలో ఉర్దూను ఇంగ్లీషును నేర్చువారికి పునాదియే సరిగాలేనందున ఉర్దూ మాతృభాష కలవారితో ఎన్నటికిని పోటీచేయుజాలరు అందుచేత పెద్దఉద్యోగాలు వారికిలభించుట దుర్ఘటము- ఉర్దూ భాషాసేవకూడా చేయజాలరు- ఇట్టివారికి "రెంటికిచెడ్డిన రేవడలు"

అయి విమర్శించు చేయవచ్చును కాని మరి మెట్లుంటే బాగుంటుంద?

## అనావృష్టిబాధలు

వర్షములు లేకపోవుటవల్ల రైతులకుకలుగుచున్న బాధలనుగురించివార్తలింకనువచ్చుచునేయున్నవి.

మెదకుజిల్లాలో అందోలుతాలూకాలో ఆరుద్రకార్తెలో కొద్దిముసురువృష్టి. మఖకార్తెఅంతమువరకు బొత్తిగావానలులేవు- పుబ్బకార్తెలో అందోల్ పట్టి, ఉత్తమార్ పట్టీలకుచేరిన కొన్ని గ్రామాలకుమాత్రమే వర్షము. అందువల్ల తాలూకాకంతటికిని పాలికభాగము మాత్రమువట్టిసేద్యమైనది- తక్కువభాగమువడావ. పచ్చజొన్నపంట మంచిగ పలించినది కాని, పెసర మినుములు, మిరపమున్న గునవి ఫలించనేలేదు. సేయనిగ భూమిలోనే ఉండిపోయినది- రబీఎత్తుగా నాల్గవవంతు మొలకలెత్తినది. ఇక ముందువర్షము కురిసినచో అదైననుఫలించును. బావులలోను ఊటలలోను నీరులేకలేదు బావులభూములలో ఖుష్కీ-సేద్యముచేసిరి- అప్పుడే త్రాగుటకు మంచినీరుదొరుకుటలేదు- పశువులకు ఇపుడు మేతదొరుకుచున్నను- తిరిగిమేతవచ్చునరకు ఏదిసరిపోదు- రైతులకుకొద్దివడ్డీకి అప్పులుదొరుకక వారలు గోహిలాలకుంటేక్షలో పడుచున్నారు- ఫలించిన కొద్దిపంట అప్పులకూడుట్టకొనిపోయినది- పైగా మలేరియాబాధవచ్చినది- సర్కారీ పన్నులలో కట్టుటకు డబ్బులేదు-

నల్లగొండ జిల్లాలో జనగామతాలూకాలో రాజా శ్యామరాజబహద్దరు గారిజాగీరు ఇలాకాకు చెందినకొన్ని గ్రామములలోసకాల వర్షములేక పునాసపంటలుపండలేదు. సేదబావుల భూములలో కలదారములవరిపంట ఫలించినది. కానిఅందులోకొంత అప్పులకుపోగా తక్కినది సర్కారీ కిస్తులకుచాలదు. వర్తకులుధాన్యమునువిలువనీయకున్నందువల్ల ధరలువిపరీతముగనున్నవి. ఒక్కొక్కసారి ఇక్క డబ్బుముకొనుటకు లభించుటయేలేదు పశువులమేత ౩ మూరలప్రాటప్రమాణముగడ్డి రూ॥ ౧-౪-౦ అయినది. త్రాగుటకు నీరుముందుముందు కరువగునని భయము గానున్నది- కూలివారలకు ముందుపనులు దొరకజాలవు- ఇపుడువర్షము పడిన సెరిబ్బిపంటలుక.

కరీంనగరంజిల్లా సిరిసిల్లతాలూకాలోనికంఠిరావుపేటలో చెరువులు కుంటలుసరిగానిండక అబీపంటలుమాత్రముపండినవి. బీదజనలకుతిండి గుడ్డలేక అల్లాడుచున్నారు-

నల్లగొండతాలూకాలోని చిత్తలూరుచుట్టుపక్క-గ్రామాలలో తొలకరిలోసామాన్య వర్షముపడగాలిత్తనాలు చల్లిరికాని అక్కడనుండి చెలువాడిపోయినవి- పశువులకు మేతలేకపోయినది. బీదకూలిజనమునకు తిండిలేకపరగ్రామాలకు పోవుధాన్యప్రబంధ్లనులపిరి. అబీదపంటపై ఉత్తఇసుకలో పైర్లపాడవుకట్టించి . కాలువత్రవ్వి చేసినవార్లు కొంతరోగాలతోకూడ వష్టమైనగముప: టకొన్నిచోట్లతేలినది- తక్కువదిటీదు పునాసపైరులు వాడుముఖంపట్టినవి- సర్కారు కిస్తులనుకట్టుటకు కష్టమగుచున్నది-

---

ఎవరైనా అడుగవచ్చును! అట్లడిగిన బాధ్యులెవరును ఇంతవరకు కానరాలేదు- మరి మేము సూచించినవానికి విలువయేమి? వడ్లవాడు చేసిన కుర్చీ బల్లలలో తప్పులుపట్టవచ్చును తప్పులుపట్టువారికి వడ్లపని రావలసినపనిలేదు- కేవలము శుష్కవిమర్శనము కాక సహకారసూచనలు చేయుట అవసరము. ఆ పనినికూడా మరెప్పుడైనా చేయదలచినాము- కాని అంతలోగా మేముకోరునదేమనగా విద్యావంతులైన ప్రొఫెసర్లు, లెక్చరర్లు, విద్యాధికారులు, అనుభవముకల గ్రాజుయేట్లు ఈ పద్మవ్యూహపు చిక్కులను విడదీయుటకు అర్హులైనవారు- వారు శ్రద్ధతీసుకొని హిందూ ముసల్మానులకును, ఉర్దూ ముల్కీ-భాషలవారికిని, బాలబాలికలగు విద్యార్థులకును అందరికిని సంతృప్తిని, సంతోషమును కలిగించు ప్రణాళికను సిద్ధముచేయుదురుగాక, "అతిసర్వత్ర వర్జయేత్ "అను న్యాయమును దృష్టిలో నుంచుకొందురుగాక. రాష్ట్రములోని నాలుగు భాషలకును సమానగౌరవము, సౌలభ్యము, ఆదరము, అభివృద్ధికలుగు ఏర్పాట్లనుచేయుట ప్రభుత్వమువారికి ప్రధానమైయున్నది- విద్యావంతులు నిస్పృహులై స్తబ్ధులైఇట్టి అతిముఖ్య సమస్యను పరిష్కరించకుండా ఉండినచో మన రాష్ట్రాభివృద్ధి యెట్లు కాగలదు?

## నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ-రాజ్యాంగ సంస్కరణములు

### ఆంధ్ర మహాసభ కార్యకారిణీ సభ పత్రిక ప్రకటన

౧౦-౧౧-౧౯౪౧వ. శనివారమునాటి, అధ్యక్ష మహాసభా కార్యకారిణీసభాసమావేశ సందర్భమున రాజ్యాంగ సంస్కరణములనుగురించి ఆంధ్ర మహాసభవైఖరి తెల్పుచు, ప్రకటించిన పత్రికాప్రకటనము:-

"౧౯౩౯వ సంవత్సరము ౧౯౩౯వ సం॥ నాడు ప్రకటింపబడిన రాజ్యాంగసంస్కరణములు అమలులోనికి తెచ్చుటలో జరుగుచున్న కాలయాపనకు కారణములను వ్యక్తపరచుచు ౨౪-౧౦-౧౯౪౧నాడు ప్రభుత్వముచే ప్రకటింపబడిన ప్రకటనను ఈసభవారు మిగుల శ్రద్ధతో గమనించిరి. ప్రభుత్వముచే నిర్దేశింపబడినసంస్కరణములు ఇంకను అమలులోనికిరాకపోయెనేయని నిరీక్షించుచున్న ఏ-ల్ప సంఖ్యాకులగు కొందరులకు అసంతృప్తి, అశాంతం గమునకలిగించుటకాకాని ప్రజాస్వామిక పునాదులపైన అభివృద్ధిదాయకమైన రాజ్యాంగసంస్కరణములను ఆపేక్షించుదేశీయులు, ప్రజాకార్యకర్తలు, ప్రజాసంస్థలలో ఎవ్వరికిని ఈనూతన ప్రకటనవల్ల విచారము విస్మయముగాని అశాంతముగాని కలుగలేదు.

ప్రభుత్వమువారిచే ప్రకటింపబడినఈరాజ్యాంగసంస్కరణములు -సంతృప్తికరముగాను నిరాశాజనకముగాను. దేశాభివృద్ధికిహానికరము గానున్నవి-ప్రజా స్వామిక సిద్ధాంతములకిందు స్థానములేకపోవుటయేగాక అట్టిసిద్ధాంతములకు ప్రతికూలమగు ఫాసిస్టుసిద్ధాంత ప్రవాదులపై ఈసంస్కరణసూచనలు నిర్మాణింపబడినవి. శాసనసభ ఎదుట మంత్రివర్గము బాధ్యతవహింపవలెనను తత్వమును అంగీకరింపకపోవుటయేగాక ఫాసిస్టు రాజ్యాంగవిధానమునందు దమలుయందుండే వ్యక్తిపూర్వకమగు ప్రాతినిధ్యము ఏర్పరుపబడియున్నది.

"దీనియందు కనీసము పౌరస్వత్వములుగూడ అంగీకరింపబడలేదు. సంస్కరణములు అమలులోనికివచ్చినతర్వాతకూడ పౌరస్వత్వముల విషయమై లేదు అమలునందుండే నిర్బంధవిధానమే లేవరూపమున అమలునందుండును.

సంస్కరణముల మూలముగా స్థాపింపబడు శాసనసభ, మరియు ఇతర స్థానికసంస్థలయందు నూటికి౫౦భాగములుగా నుండునట్టియు దేశముయొక్క-ధనోత్పత్తిలో ఇంచుమించుగా అంతయును ఉత్పత్తిచేయునట్టియు, దేశమునకు వెన్నెముగానున్నట్టియు రైతుకు మిక్కిలి స్వల్పముగా ప్రాతినిధ్యమొసగబడి. రైతునుపూర్తిగ అణగద్రొక్క-ఉద్దేశ్యముగల అతి అల్పసంఖ్యాకులగు ఇతరవృత్తులవారికి అత్యధిక ప్రాతినిధ్యమొసగబడినది. ఈఇతరవారికిని పలు ఎంతవిభేదములున్నను వీరందరు Vested interests (స్వార్థపరులైనందున), సంస్థలయందు వీరికి మంచిస్నేహము సహకారముకలిగి, ఒక సమిష్టిపార్టీ ఏర్పడుటకప్పదు ఈపార్టీవారు నిరుపేదయును, కొంగదివారు గామాత్రమే వచ్చునేర్పాటు గావింపబడిన రైతు ప్రతినిధులను అణచుటయందు తమసర్వశక్తులను ఉపయోగించెదరనువిషయము నిర్వివాదాంశము.

"ఈసంస్కరణలయందు పై నుదహరింపబడిన ముఖ్యములు కారణములమూలముగను, మరియు ఇట్టివే ఇతర కారణములచేతను. సాధారణముగా అవలన బాగుపడనట్టి పుట్టుదోషములున్నందునను సప్తమాంధ్రమహాసభమల్కాపురములో సంస్కరణలపైపు అంగీకరింపబడిన పదో [౧౦] తీర్మానముద్వారా ఐవలంబించిన వైఖరియందు మార్పు యుక్తముగలేదని ఈ సభవారు తమ స్పష్టమైన అభిప్రాయమును ప్రకటించుచున్నారు

## నామమాత్రపు సభ్యులు

మహబూబ్ నగర జిల్లా ఆంధ్రసంఘ కార్యనిర్వాహకకమిటీసభ్యులు ఆరు తాలూకాలలోను ఈజిల్లాకుసంబంధించినవార్లు, ఆత్మకూరు, వనపర్తి, కొల్లాపురు గోపాలుపేట ప స్థానములలోను- గుల్బర్గజిల్లాకు సంబాధించినకొడంగల్ తాలూకాలో సహితము ప్రబలియున్నారు- కానిఇంతవరకు ఒకసర్కులుగుకమిటీకూడ జరిపియుండలేదు- ఆహ్వానముపై సభ్యులుసరిగాహాజరుకాకున్నకూడ తెలిసినది- ఈజిల్లాలో ఆంధ్రోద్యమ పచారముకూడ ఏమాత్రముజరుగలేదు-ఈ విధముగా నామమాత్రపు అధికారములుపొంది ఆంధ్రదేశ సేవయేమిచేయుగలరో తెలియకున్నది-కయచేసి నిజసేవచేసి ఆంధ్రోద్యమప్రచారమును సాగింతురనిఆశిస్తున్నాను

ఒక రు

# యూరపుఖండముపై బ్రిటనుయెందుకు దాడి వెడలదు?

(Tolking Points నుండి)

బ్రిటను యూరపుఖండముమీద దాడి వెడలి అక్కడ కొంతిభాగము జర్మనుసేనకు పనిపెట్టిన చో జర్మనీకి రష్యాపైపున నేగాక ఇటుయూరపు లోకూడ యుద్ధపుఒత్తిడి యెక్కువయై దుర్భర మగుటయేగాక రష్యావారునలిగిపోకుండ ఎక్కువ సహాయముచేసినట్లు అగుననియు ఇపుడుయూరపుఖండములో జర్మనుల క్రింద పడినలుగుచు రహస్యము లైన తిరుగుబాటులుచేయుచున్న నానాజాతీయులు ఈబ్రిటిషువారితోడై నిర్భయముగా తవతిరుగుబాటులను చేసెదరనియు, ఇపుడే జర్మనీపేన్నాళ్లకు యీయుద్ధముఅంతమగునట్లు కని పించుటలేదని విసుగుకొనుచున్న జర్మనీప్రజలు కూడ విసిగితిరుగుబాటుచేయుటవల్ల బ్రిటిషుదం డయాత్రవిజయము చెందుననియు అమెరికాప్రజలుకూడ బ్రిటను ఉత్తమాటల జాతికాదని గ్రహించి బ్రిటనుకు ఇంకనుయెక్కువ సహాయముచేసెదరనియు కొందరుసూచనలు చేసినారు–

కానిఅట్టి దండయాత్రకు ఈక్రిందిఅంశములు అటంకము లైయున్నవి– ఇపుడు బ్రిటనుసేనలు కొంచెముకక్కువగానున్నవి– బ్రిటనుపై దండయాత్ర కలుగనున్నదనే భయముపూర్తిగా తొలగిపోవువరకు వాటినికొన్నిటిని అక్కడ కొన్నిటిని ఇక్కడవిభాగముచేయుట మంచిదికాదు– ఇపుడు బ్రిటిషువిమానాలు జర్మనులప్రదేశములపై ప్రతిరాత్రిబాంబులను వేయుచు అనేకము లైనజర్మనుసేనలను కదలజాలకుండ చేయుచున్నవి– దండయాత్రవల్ల ఇంతకంటెఎక్కువసాధించేదిలేదు–

రష్యావారుస్పష్టముగా కోరిన సహాయాన్ని అమెరికాబ్రిటనులు పంపుచు సేయున్నవి బ్రిటిషువారికే యూరపు ఖండములో దండయాత్రకు పూనుచో రష్యాకు పంపే సహాయాన్ని తగ్గించుకొనవలసియుండును అందువల్లరష్యా ఓడిపోవుటకుతోడ్పడుటయగును ఇపుడుదండయాత్ర బ్రిటనుచేయుచో జర్మనులుతమకుక్రిందనుండే జాతులతిరుగుబాటును తీవ్రముగాఅణచుటకు చర్యలుగైకొందురు– ఇపుడన్ని సోఅంతగట్టిచర్యలకై శ్రద్ధవహించరు– కనుక తిరుగుబాటు నెమ్మదిగావృద్ధిచెందుచుండగలదు. రెండేండ్లనుండి అపజయంలేకుండా జర్మనుసేన దండయాత్రలుచేయుచు క్రొత్తరాజ్యాలను రాబట్టుకొనుచున్న సమయములో బ్రిటిషుసేనలు యూరపుమీదపోయి పడినంతమాత్రాన అక్కడిజనులు విసిగితిరుగుబాటుచేయరు. అమెరికా వారిమెప్పులకై సైనికసౌకర్యముల విడనాడిదండయాత్రలు జరుపుటకంటె అవివేకములేదు.

## త్వరలో భారత దేశంపై పు యుద్ధము

యూరపుఖండముపై బ్రిటిషువారి దండయాత్ర విజయాస్త్రముకాలేరనిన ఇంతవరకుఏరాజ్యముకూడ సాధించేజాలనంత సాధించవలెను– అనగా భూమిపైజర్మనుసేనలను ఓడించవలెను– అందుకుతగినన్ని టాంకులు విమానాలు మున్నగునవి తయారుచేసికొనుటకు బ్రిటిషు అలస్యంగా ప్రారంభించినది– అతగినంతసామగ్రి ఉత్పత్తి పూర్తికాకముందు బ్రిటనుక్రొత్తదండయాత్రలో దిగజాలదు, మరియు ీటనుదేశముపైనను టర్కీ–

# సుభాష్‌బోసుగారిని గూర్చి జరనురేడియో

సుభాస్‌చంద్రబోసుగారినిగురించి ఇండియా ప్రభుత్వపు దేశీయాంగశాఖమంత్రిగారు కౌన్సిల్ ఆఫ్‌స్టేటులో చెప్పినమాటలను జర్మనీ, జపాను లరేడియోలు ధ్రువపరచినట్లు ఢిల్లీలోనవంబరు ౧౩ వతేదిన తెలిసినది. నవంబరు ౧౨ వతేదినహిందూస్థానీభాషలో ఇటాలీయులరేడియోలో ఇట్లుచెప్పబడినది. "బోసుగారు జర్మనీలోనున్నట్లు జర్మనురేడియోప్రకటించినది– భారతీయుల బాబుసుభాష్‌చంద్రబోసుగారి ఉపన్యాసముకొఱకై ఆత్రముగావేచియున్నారు. వారుతమదేశీయులకు ఉపన్యసించుటకై బెర్లినురేడియోలో ఒకఅవకాశము యొసగబడునని మేముఅన్నివిధములఆశతోనున్నాము"

అదేరోజున హిందూస్థానీభాషయందే ఒకజపానురేడియోలో ఇట్లుచెప్పబడినది. "జపానులో "ఇండియన్ ఇన్డిపెన్డెన్సులీగుయొక్క అధ్యక్షుడగు రాష్‌బిహారిబోసుగారు సుభాష్‌చంద్రబోసుగారు క్షేమముగాజర్మనీలో చేరినందుకు అభినందించుతెలిగ్రాముపంపినారు– సుభాష్‌బోసుగారు ౧౯౪౧ జనవరిలో భారతదేశమునుండి లేచిపోయియుండిరి– ఇపుడువారు జర్మనీకిచేరినట్లు, భారతదేశమునకు స్వాతంత్ర్యమునిప్పించుటకై ఒకసేనసుపంపుటకు జర్మనీతో ఒకఒడంబడికచేసికొని దానిపైసంతకముపెట్టినట్లును తెలిసినది"

# భారత దేశములో అతృప్తిని తీర్చుడు

బ్రిటిషు లార్డు గారి వాదన

బ్రిటిషుపార్లమెంటుయొక్క లార్డులసభలో నవంబరు౧౨వతేదిన బ్రిటిషురాజుగారి ఉపన్యాసమునుగురించి లార్డుఅడిసన్‌గారు (లేబర్‌పార్టీకిచెందినవారు) విమర్శించుచు భారతీయసేనల ధైర్యసాహసములను మెచ్చుకొన్ని వాటికెంత పొగడినను అతిశయోక్తికాజాలదనిరి–అయినను భారతదేశమునుగురించి గాని బర్మానుగురించిగాని రాజుగారు ఏమియుచెప్పనందుకుఖేదపడిరి. యుద్ధమువల్లకష్టముగా ఉన్నను భారత దేశములోను బర్మాలోను అభివృద్ధి అక్కడివారలయిష్టానుసారముసాగుటకు బ్రిటిషువారట్లుచేయుటకు బ్రిటిషువారు అవకాశమును పోగొట్టిరనుఆశతోనున్నాననిరి–ఇపుడు ఆదేశములవారలలో ఉన్న అతృప్తినితీర్చి, భారతదేశంలో ఇపుడు బ్రిటిషువారితో సహకారముచేయకుండా ఉంటున్న పార్టీల నాయకుల చురుకైనసహకారము పొందుటకు యత్నముచేయబడునని ఆశించిరి.

ఇరాఖు, ఇరాను ప్రాంతములయందును తూర్పు ఆసియా ప్రాంతమందును తమశత్రువులు గెలవకుండ బ్రిటిషువారుచూచుకొనవలసి యున్నది– ఈసందర్భమున చర్చిల్‌గారు భారతదేశప్రధానసేనానికి పంపినసందేశములోని ఈమాటలుగమనించదగినవి– "భారతదేశపుసేనలు త్వరలోనే నైలునదినుండి కాకేసస్‌వరకు పోరాడుచు తమగృహములను, జనులను రక్షించుకొనవలసియుండును." బ్రిటిషువారిపుడు యూరపుఖండముపై దండయాత్రలో పడుచో ఈభారతదేశరక్షణకు కూడ ఆటంకముకాగలదు–

# రాజకీయఖైదీలవిడుదల ఆలోచన

అమెరీగారిప్రకటన

భారతదేశపు రాజకీయఖైదీలను డిటెన్యూలను విడుదలచేయువిషయమై కామన్సుసభలో నవంబరు ౧౨వతేదిన గార్డనుమాక్డొనాల్డుగారు అమెరీగారినిఅడిగినారు.

"సత్యాగ్రహఖైదీలయొక్కయు డిటెన్యూలయొక్కయు సంఖ్య క్రమక్రమముగ తగ్గుచున్నది– తక్కినవారి విడుదలవిషయమై యాలోచింపబడుచున్నది" అనిఅమెరీగారు సమాధానమిచ్చిరి–

# భారతజాతీయ వాంఛ

బ్రెయిల్స్‌ఫర్డుగారి సమర్థనము

హెచ్–యన్. బ్రెయిల్స్‌ఫర్డుఅను ప్రసిద్ధ బ్రిటిషురచయిత భారతదేశముయొక్క జాతీయ స్వతంత్రవాంఛను తమర్థించువారు. వారు ఈసారి "రీనాల్డ్సున్యూస్" అను పత్రికయందు తనస్వాతంత్ర్యముకొఱకై పోరాడుటకు భారతదేశమునకు అవకాశమీయుండి అను శీర్షికక్రింద ఒకవ్యాసమందు ఇట్లువ్రాసినారు.

"భారతదేశరక్షణకై మించితెలివిగలసైనికుడు చేయగలిగినదంతయు వేవెల్‌గారుచేయునని మనము నమ్మవలెను– కానిమనము భారతదేశమును రక్షించుచుండుట ఈకాలమునతగనిది. భారతదేశమే ఆపనిచేసికొనవలెను ... జీతమిచ్చినచో ఆయుధముగను, కార్ఖానాలలోపనివారలు గాన వచ్చుటకు దరిద్రులెప్పటికిని సిద్ధమే. కాని ఈ జనులసంకల్పబలము, తెలివి నిజముగా జాతీయమనదగిన ప్రయత్నమునందు చేరలేదవలెను– భారతదేశము మనకొఱకు గాని, చక్రవర్తికొఱకు గానిపోరాడదు భారతిజాతి తనస్వాతంత్ర్యము కొఱకే పోరాడగలదు– దానికి నాయకత్వము వహించిజాతీయ ప్రభుత్వమున్నపుడు ఆదిఅపని చేయును ...... మనము భారతదేశముయొక్క ఆత్మగౌరవ భారమును సంతృప్తిపరచి, దానిఅభిమానమును పొందుటకు శ్రద్ధవహించినచో, అది దానియంతటనే మనమిత్రముగా చేరగలదు–... చర్చిల్‌గారికి ఆలోచనలేకపోలేదు– తానుమంచితెలివి, ధైర్యముగల ప్రపంచములోకివచ్చి వానిభావించి వారుఒకఅర్ధగంటసేపు పరీక్షించిచూచినచో ఫ్రెంచివారిఅపజయపు రోజులలోవారు మనలలో ఉత్సాహముపురికొల్పినట్లే భారతీయులలోకూడ ఉత్సాహముపురికొల్పి తమపక్షమునకుచేర్చుకొనగలరు– గంభీరోపన్యాసమువల్ల అదికాజాలదు– వారలను మనపక్షమునకు ఆకర్షించుకొనవలెనినిన ఉదారమార్గ మవలంబించవలెను– జైళ్లనుఖాళీచేయవలెను– ౭ రాష్ట్రములలో మరల భారతీయమంత్రులు ఏర్పడవలెను– కానిఅసలు ముఖ్యమైనది జాతీయప్రభుత్వమును అపేరుతోను, అందుకుతగిన అధికారములతోను ఏర్పాటుచేసిస్వాతంత్ర్యమొసగబడిన ఆప్రజలకు నాయకత్వమునునుంచుట అసలుక్రొత్తరాజ్యాంగ రచన యుద్ధముముగియువరకు వేచియుండగలదు– కానిదానిని భారతజాతీయ ప్రభుత్వముచేయునట్లు మనమిపుడు శ్రద్ధవహించవలెను– జాతీయసంకల్పమునకు విఘ్నముకలిగించునట్టి మినహాయింపులిచ్చుఅల్పసంఖ్యాకులకు బలము కలిగించరాదు– మరియు ఈప్రభుత్వములోపనిచేయుటకు మనము చెప్పినదానికి తలఊచెడివారలనుగాక, భారతదేశమువిశ్వసించుచున్న నాయకులలోబలిష్ఠులను ధీరతములను ఆహ్వానించవలెను–... చర్చిలుగారుపెద్దవారేకాని ఇట్టిపనిచేయగలిగినంత పెద్దవారేనా? దీనినిచేయగలిగినచో వారుఅమెరికాను మాత్రమేగాక భారతదేశమునుకూడ అందింపలేవి. యూరపీయప్రజానీకమునకు ఆశాజ్యోతినొసగగలదు–

## జాబులు

### సీతారాంబాగు పాఠశాలపై

#### ఆక్షేపణలు సత్యదూరములు

ఆంధ్రులకు ఆంధ్రభాషపయిన ప్రథమధర్మమునకు శీర్షికగల వ్యాసమును చూచితిని. సీతారాం బాగు పాఠశాలా కార్యక్రమమునందు చిరపరిచయము లేనట్లు వారివ్రాతలవలననే తేటతెల్లమగుచున్నది. పాఠశాల ఆంధ్రులచే స్థాపింపబడెనని అందుండువిద్యార్థులందరు ఆంధ్రులేయని ఉపాధ్యాయులుగూడ ఆంధ్రులేయని ఒప్పుకొనిరి, ఇంతమంది ఆంధ్రులైయుండ ఇందుఆంధ్రభాషకు ప్రాముఖ్యతలేదని ఏట్లుగోచరించెనో తెలియదు.

గతసంవత్సర వార్షికోత్సవసందర్భమున శ్రీ రాజాబహద్దుర్ వెంకటరామారెడ్డిగారు అధ్యక్షపదవిని అలంకరించుటయు ఆంధ్రపితామహులను బిరుదమునొందిన బ్రహ్మశ్రీ మాడపాటి హనుమంతరావుగారు మూర్తుల రాంకిషన్‌రావుగారు మొదలగుమహనీయులు ఇందలి కార్యక్రమమును గురించి పరిశీలనతో ఆంధ్రమున ఉపన్యాసము లిచ్చుటయు అందుస్వాగతపద్యముల నర్పించుటయు కార్యక్రమములను ఆంధ్రభాషలో సభికులకుపమత్కమున విన్నవించుటమొదలగు కార్యములు పక్షపాతరాహిత్యముగా సంస్కృతఆంధ్ర హిందీభాషలలో జరుపబడినవిషయమును వారు పత్రికలవలనగాని చిరపరిచితులగు మహనీయుల వలనగాని తెలుసుకొనకపోవుటచే నిట్లువ్రాయుటకు సాహసించిరి ఈసంవత్సర కార్యక్రమము గూడా పక్షపాతరాహిత్యముగానిరుపనిర్వయించి ఆంధ్రసోదరులకందరికిని ఆహ్వానమంపినను ఆంధ్రసోదరులు రాకపోవుటచే సభనలంకరించియుండువారందరూ హిందీలోజరుపుట నపేక్షించుటచే నాటికార్యక్రమము హిందీలో జరుపబడెను.

"కేవలము సంస్కృతము నభ్యసించినమాత్రమున పండితులనుచు భ్రాంతినిపీడుదురుగాక" యనివ్రాసిరి. దీనినిబట్టిచూడ పైవారికి సంస్కృతభాషయందుఎట్టిఆదరముకలదో పాఠకులుగ్రహించుదురుగాక.

#### పాఠశాలఉద్యమము

సుమారు ౧౦-౧౫సంవత్సరములక్రితము శ్రీ ఉ-వే-శ్రీ-కందాడై శ్రీ శఠగోపరామానుజాచార్యస్వామివారు ఇచ్చటనివసించు ఆంధ్ర శ్రీవైష్ణవవిద్యార్థుల అభివృద్ధినపేక్షించి నిస్వార్థముగా అనేకమంది విద్యార్థులకు విద్యాదానమును చేయుటయేగాక విద్యార్థులకు భోజనాద్యుపపత్తులగలిగించి సంస్కృత విద్యావ్యాప్తిచేయ నపేక్షించి ఉభయవేదాంతవర్ధని పాఠశాలయను నామకరణముచే పక్షపాతరాహిత్యముగా పాఠశాలజరిపించుచున్నారు. పైసంస్థకు ఏవిధమైన ద్రవ్యాధారమునులేకున్నను విద్యార్థులు అధికసంఖ్యాకులగుటచే స్వామివారిఅను మతినుపరించి ప్రస్తుతకార్యకర్తనగునేను హైద్రాబాదునివాసధార్మికుల ధనసహాయముచే ౬ సంవత్సరముల నుండి దేశాంతరులకు భోజనాదిసౌకర్యములుకలిగించి కార్యక్రమమును ప్రారంభించి ఉపపత్తులనుబట్టి నానాటికివృద్ధిపొందించుచు ప్రతివార్షికనివేదికయందు పాఠకులకార్యక్రమము నివేదించుచున్నాడను. ప్రస్తుతమునిందుండు ౭౦ మందివిద్యార్థులు ఆంధ్రులైయుండపాఠ్యక్రమము ఆంధ్రములోతప్పమరిఏభాషలో జరుపబడునో పాఠకులే గ్రహించగలరు ఇటీవల ఒకసంవత్సరమునుండి రాజా సర్ బన్సీలాల్ ట్రస్టుఫండునుండి నెలకి ౫౦ రూపాయిలు సహాయమొసగుచు హిందీభాషాపరిజ్ఞానమునకైమమ్ములప్రోత్సహించుటచే హిందీభాషకూడ జరుపబడుచున్నది. ఇందుపక్షపాతబుద్ధిచేతనా కార్యక్రమము జరిపించుట ఈసంస్థయొక్క ఉద్దేశ్యముకాదు. ఇందువర్ణాశ్రమానుకూలపద్ధతులపరిశారముగ్రోతివారువచ్చి సంస్కృత ఆంధ్రహిందీ విద్యాలాభముపొందుటకు ఏ కొమాత్రమును సందేహముండజాలదు.

శ్రేయాంసిబహువిఘ్నాని అనురీతిన ఇట్టి అలంబన ధర్మకార్యములు శాశ్వతముగాజరుగుట దుర్లభమైనను భగవత్ప్రేరణముచే నిరాటంకముగా జరుగుచుండపాఠశాలయందు పక్షపాతమనిగాని మతభేదమనిగాని వ్యక్తిగతభేదములు కలవనిగాని ఇతరులుఎన్నివ్రాసినను సంస్థకుహానికరంబుగా జాలదనిఇంతటితో విరమించుచున్నాను. పాఠకులు నిజానిజముల అరసిచూడదలచినచో ప్రత్యక్షముందు సమాధానమొసగబడును.

ఇట్లు

గోబ్బూరు తిరుమలనరసింహాచార్యులు.

(ఈచర్చఇంతటితో పరిసమాప్తి సీతారాంబాగులో రెండుపక్షములేర్పడినవి. ఉభయులును ఆంధ్రనాయకుల ఎవ్వరినైనా మధ్యవర్తిగా యేర్పాటుచేసుకొని పూర్వమువలె వివాదాలులేకుండా ఐకమత్యముతో ఉండవలెనని సూచించుచున్నాము. గో-ప.)

## వైశ్యసోదరులకు మనవి

ప్రపంచము వృద్ధికిరావలయుననిన ప్రతిసంఘము మన మతాలుసంఘాలు బాగుపడవలయును. మొదలుపైవాటిని చక్కచేయకపోతే దేశమెన్నికాలానికైనను వృద్ధికిరాదని ఎన్నియోమారులు మనభారతదేశ నాయకులు తెలిపిచ్చిరి. అందుకనుగుణముగా కొన్నిజాతులవారు వారివారికులముల బాగోగులకై కృషిచేయుచున్నసంగతి మనవారికి బహుశా తెలియును. కాని మనవారుజాత్యభివృద్ధికై పాటుపడకపోవడము మనయొక్క దురదృష్టము. మనలోఎంతోమంది విద్యావంతులు అంతకన్న ఎక్కువధనవంతులుండికూడ సంఘసేవచేయకపోవడంవలన మనసంఘము దినదినముక్షీణించిపోవుచున్నది. దీనికిముఖ్యకారణమే మనధనవంతులు మరియువిద్యావంతులు లోకువంతీసుకొని సంఘాభివృద్ధికై పాటుబడకపోవడమే ఇట్లుచూచుచు ఊరుకుంటే మనసంఘముఎంత అధోగతిపాలగునో మీకుగోచరము.

ఇట్లు-బి-రాజయ్యగుప్త

గంభీరరావుపేట తాలూకాసిరిసిల్లా

కరీంనగర్ జిల్లా

గ్రంథదానము

శ్రీ ఆంధ్రగ్రంథాలయము, కొరుపాముల తా॥ నాగర్‌కర్నూలు ఈ గ్రంథాలయమునకు

## విచిత్ర జగత్తు

అమీరాబాదులో ఒకభోరింగుబావిని త్రవ్వుచు ౫౦-అడుగుల లోతుపోయినతర్వాత అక్కడినుండి ఒకవిధమైన అరిచెలుగలదెను-అటుమెంటనే మందులు నిప్పురవలు మహావేగముతో చాల యెత్తుకెగసెను-అంతటితో భయపడి దిగవేసిన గొట్టముయొక్క రంధ్రమును పూడ్చివేసిరి. ఇప్పటికిని రాత్రింబగళ్లు ఒకపెద్దశబ్దము అక్కడనుండి వినవచ్చుచున్నదట.

... ... ...

లండనులో ఇటీవల ౭ ఏండ్ల బాలిక ఒకతె వీధిలోపడగా ఒకదంతమువిరిగెను. అది జరిగిన ౧౫-గంటలతర్వాత ఆదంతముతో బాలిక దంతవైద్యునివద్దకు పోయెను. ఆదంతవైద్యుడు ఆదంతమూలమున నిర్జీవముగుభాగమును తీసివేసి మరల ఆదంతమును ఆపిల్లచిగురులో పెట్టి సన్ననితీగనుచుట్టి గాకట్టివేసెను. రెండునెలల తర్వాత చూడగా ఆదంతము బాగుగా అతుకుకొని సరిగా యుండెను.

... ... ...

అమెరికాలో "అమెరికా రసాయన విజ్ఞాన సమితి"యని ఒకటిగలదు- ఆసమితివారు చేసిన పరిశోధనలవల్ల చాలాశ్రు ఒక అర్థసేరు పచ్చిగడ్డిలో ౧౫సేరుల పండ్లలోను కూరలలోను ఉండే విటమినులకంటె ఎక్కువ విటమినులుగలవని తేలినది-ఆకులఎండుగడ్డిలో ౧౫౦సేరుల పండ్లలోను కూరలలోనుఉండే విటమినులకంటె ఎక్కువ విటమినులుఉండినట్లు తేలినది- అమెరికాలో జనులు పండ్లు, కూరలు చాలినన్ని వాడనందువల్ల యుద్ధపుపనులకు చాలినంతపాటవము లేకుండా ఉన్నారని ఒకఅన్వేషణ బయలుదేరినది ఇప్పుడు అందరును గడ్డితినేటట్లుచేసినబాగుండునని చూచుచున్నారు- గడ్డి మనుష్యునికి రుచించదాయెను. అదిరుచించునట్లు చేయగలవారెవరైనను ధ్రువపడుచో వారికిగొంతుల దాలరులను బహుమతిగా నిచ్చుటకు ఏర్పాటుచేయబడినది.

## ప్రకటన

స్టేషన్ శంకరపల్లి వాస్తవ్యుడగు పిల్లిగుండ్ల రాచయ్య

సాహాను యిందుమూలముగా అందరకు తెలియచేయుట యేమనగా, నేను నాతమ్ముడు రామదాసు యింతవరకు సమిష్టి కుటుంబస్థులమై, "పిల్లిగుండ్ల రాచయ్య, రామదాసు" అను పేరుతో వ్యవహారము జరుపుకొనుచుయుంటిమి. కాని కొన్ని కారణములవల్ల నేను నాతమ్ముడు రామదాసువిభాగము కాదలచి, పంచులద్వారా మాయావత్ జాయదాదు, దస్తరం, దుకాణం లేవదేవి శ్రీవృషనామసంవత్సర చైత్రి బ॥ ౧ నాడు విభాగముచేసుకొని ఎవరిదుకాణము వ్యవహారము వగైరాలు వారివారి పేరట వేరు వేరుగా జరుపుకొనుచున్నాము. కాబట్టి ఒకరివ్యవహారముతో మరొకరికి ఏవిధమైన సంబంధములేదు అట్లు ఏవిధమైనసంబంధము ముందుగూడ యుండజాలదు.

ఇట్లు

పిల్లిగుండ్ల రాచయ్య

జటప్రోలు సంస్థానములోచేరిన పెద్దకొత్తపల్లి గ్రామం మ-రా-శ్రీ గోపూరు లక్ష్మీకాంతరావు పట్వారిమక్తేదారు గారు దయతో చందాదారుగ చేరుటకు (3/) రూపాయిల వెలగల అత్యుత్తమ గ్రంథములను దానమొసగిరి. ప్రశస్తమగు శ్రీవారి విద్యాభిమానమునకు మా హృదయపూర్వక కృతజ్ఞతను నివేదించుకొనుచున్నాము.



ఇట్లు,

గ్రంథాలయగౌ॥ కార్యదర్శి

యం. సోమసుందరశర్మ

## ఖాస్గీ కంపెనీల రైళ్లుండరాదు

### భారతశాసనసభ వారి నిర్ణయము

భారతశాసనసభ రెండవశాఖ యగు స్టేటు కౌన్సిలుసభ నవంబరు ౧౯వ-తేదీ ఉదయము సమావేశమైనపుడు పండితహృదయ నాథకుంజ్రూ గారు "బెంగాలు అండ్ నార్తువెస్టరన్ రైల్వే" కంపెనీవారి రైలుబాటల సౌకర్యాలను "రోహిల్ఖండు-కామాయూన్ రైల్వే" కంపెనీవారి రైలుబాటల సౌకర్యాలను ఇండియా ప్రభుత్వమువారు ౧౯౪౧ డిసెంబరు ౩౧-వతేదివాటికి కొనవలెననియు ఆసంగతిని సదరు కంపెనీలకుముందుగా తెలియబరచవలెననియు ఒక తీర్మానమును ప్రతిపాదించిరి. తీర్మానముగురించి ఉపన్యసించుచు వారు ఇపుడు రోహిల్ఖండ్ రైల్వేవారి-బాటలలో నూటికి ౫౦ పాళ్లు "బెంగాల్ అండ్ నార్తువెస్టర్న్ రైల్వేవారి బాటలలో ప్రతిశ్శతి ౭౦ పాళ్లను ఇండియా ప్రభుత్వమువారి అధీనమందే యున్నవనిరి. ఇండియాదేశములోని రైళ్లు క్రమేణ ఇండియా ప్రభుత్వపు సొత్తుగావలెనను పద్ధతిని ఇండియా ప్రభుత్వమువారు ఇదివరకే అంగీకరించియున్నారు. "బెంగాల్ నార్తు వెస్టరన్" రైల్వేకంపెనీవారి రైళ్ళవిషయములో ౧౯౩౧లో భారతశాసనసభయగు అసెంబ్లీలో అప్పటి రైల్వే అమంత్రియగు సర్ జార్జి రెయినీగారు ప్రతిపాదించిన ౨-వ తీర్మానమును ఆమోదించబడియుండెను. తర్వాత ౧౯౩౪ లో ఆదేసభలో కొంత చర్చజరిగియుండెను. ఆరెండు సమయములలోను ప్రభుత్వము ఆరైల్వేకంపెనీవారి రైళ్లను కొనుటను ముందుకు మరొకరోజుకు చూచెదమనియు అట్లుచేయుటవలన తక్కువధరలకు కొనగలుగుదురనియు సమాధానమిచ్చియుండెను. ఇపుడు ఎంతధరతగ్గినదో తెలుపవలెనని కుంజ్రూ గారు కోరుచున్నపుడు ప్రభుత్వమువారి ఆర్థికస్థితిచాలా బాగున్నందువల్ల దానిని కొనివేయవలెననిరి

రైళ్ళశాఖ కార్యదర్శియగు యస్. యన్. రాయిగారు సమాధానమిచ్చుచు ప్రభుత్వమువారు ఇందుకు సంబంధించిన విషయములన్నిటిని జాగ్రత్తగా పరిశీలన చేయుచునే యున్నారనిరి. ఇపుడు కొనుటకు నిర్ణయమైనచో బెంగాల్ నార్తువెస్టర్న్ కంపెనీవారికి ౧౭కోట్ల ౪౮ లక్షల రూపాయలను చెల్లించుటయేగాక ౧౯౩౦౦౯ పౌనుల డిబెంచర్ల క్రమముకూడ చెల్లించుకొనవలసియుండుననియు ఇట్లు మొత్తము ౧౯౩ కోట్ల రూపాయలగుననియు రోహిల్ఖండు రైల్వేవారికి మరి మూడుకోట్ల రూపాయిలు కొనగవలసియుండుననియు ఇపుడు ప్రతిపాదించిన తీర్మానము విషయమై సభవారు పట్టేపట్టుచో, ప్రభుత్వప్రతినిధులు ఏమైపునను ఓటులనీయకతటస్థులుగా నుందురనియు చెప్పిరి,

పండిత కుంజ్రూగారు ౧౯౩౭వ వరకు కాచుకొని యున్నచో ఏమీ చెల్లించకుండానే ఆరైల్వేలను పొందవచ్చునని యస్. యన్. రాయిగారు చెప్పినమాటకు సమాధానమిచ్చుచు బెంగాల్ నార్తువెస్టర్న్ రైల్వేవారొక్కరే సంవత్సరము ౧కి ఒకకోటి రూపాయిలకుపైగా లాభము తీయుచున్నారనియు మరి ౭౦ ఏండ్లు వేచియుండుటవల్ల వదులుకొనవలసివచ్చు లాభమే ఇపుడు చెల్లించవలసిన క్రయముకంటె ఎక్కువగా నుండగలదనియు చెప్పిరి. ప్రభుత్వమువారు ఆలోచించుకొనుచున్న చిక్కులెవ్వియో విశదపరచవలెనని వారు కోరిరి. ఈరైళ్ళపరిపాలనను గురించి ప్రజలు చాలవిసుగుచెంది యున్నారనిరి,

తుదకు కుంజ్రూగారు ప్రతిపాదించిన తీర్మానము సభవారిచే ఆమోదించబడెను.

ఈతీర్మానమునుగురించిన చర్చకంటె పూర్వము సభ్యులడిగిన ప్రశ్నలకు ప్రభుత్వప్రతినిధులు సమాధానముల నొసగిరి, అందులో ఒకప్రశ్నకు సమాధానమేమనగా సర్ హరిసింగుగౌరుగారు లండనులో ప్రభుత్వమువారినుండి లైసెన్సు పొందని ఒక హోటలుకు వచ్చెదనని టెలిఫోనులో తెలిపి, అక్కడికి పోయినతర్వాత ఆహోటలు యజమానులు "మీరు విదేశీయులు గాన మాకిక్కడ చోటులేదుపొండి" అని చెప్పిరట. నేను బ్రిటిషుప్రభువుగారి ప్రజలలోనివాడ నేనని గౌరుగారు చెప్పుకొన్నను వినలేదట. ఈవిషయములో ఆహోటలువారిని ఏమిచేయుటకును బ్రిటిషుప్రభుత్వమునకు అధికారములేదనుకున్న ౧౯౪౧ జూన్ ౧౯వతేదివాటి బ్రిటిషు పార్లమెంటు కామన్సుసభలో గౌరుగారియెడచూపిన అగౌరవము తగదని అభిప్రాయములు తీక్షముగా వెల్లడించబడెననియు ఇండియా ప్రభుత్వమువారు కూడ అదే అభిప్రాయముతో చేయుచున్నారనియు ప్రభుత్వప్రతినిధి సమాధాన మిచ్చెను.

మరియొకవిషయము జనపరిగణనకు సంబంధించినట్టిది. వారు భారతదేశపు జనసంఖ్య హెచ్చినను, అందులో గొప్పయేమియు లేదనిరి, జనసంఖ్య లెక్కలను కావలెనని పెంచిమారినవారు

## దియోలీ ఖైదీల కోరికలు

### ప్రభుత్వమునకు గాంధిమహాత్ముని విజ్ఞప్తి

గాంధిమహాత్ముడు నవంబరు ౧౮వతేదీన ఈ క్రిందివిధముగ పత్రికలలో ప్రకటించెను:-

నేను ౧౭వతేదీన శ్రీ జయప్రకాశ నారాయణగారికి ఈక్రిందితంతిసందేశమును పంపించియుంటిని, "మీరును, ఇతరులును నిరశనదీక్షను మానవలెనని గట్టిగా సలహానిచ్చుచున్నాను-కోరికలు తీరునట్లుచేయుటకు ప్రజాభిప్రాయము సృష్టించబడుచున్నది. డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారును మియాఇఫ్తికరుద్దీన్ గారును ఈ విజ్ఞప్తియందు నాతో కలిసియున్నారు- ప్రభావతి మిమ్ములను మానవలెనని తొందరపడుచున్నది. ముందేమి జరుగునో మాకిచెప్పవలెనని ఆమె నాపియున్నాను" దీనికినాకిపుడే ఈ క్రిందిసమాధానము వచ్చినది: "తంతిసందేశమునకు కృతజ్ఞుడను- ఇన్నివిధముల సర్దార్ మంగళసింగుగారి తెలుపగదినాను-నాకోరికలు న్యాయమైనవి నిరశనదీక్షను మానజాలనందుకు క్షమింపుడు-బయట మీరుచేయగలిగినదిచేయవచ్చును. ప్రభావతిని పంపించవద్దు.

సర్దార్ మంగళసింగు గారి నుండి నాకింకను ఏమియు తెలియలేదు-మున్ముందుకు ఏమిపుడుండునో అదియు తెలియగలదు-కాని ఈవిషయమున ఆలస్యము సహింపరానిది- శ్రీజయప్రకాశు గారి తూకము చాలా తగ్గిపోయినట్లు వింటిని- బలవంతముగా ఆహారముతినిపించుట ప్రస్తుతమునకు తప్పించుకొనుమార్గము మాత్రమే. శ్రీ జయప్రకాశు కార్యకర్తలలో చాలవిలువగలవారిలో నొకరు-వారిని మెత్తబరచగలదేదిగాని ఉన్నచో, అది మేము కలిసిపంపిన తంతిసందేశము అయియుండవలెనని నమ్ముచున్నాను నేను ఆశ్చర్యముచేసికొనుచున్నాను-తన భార్యనురావద్దని వారు వాదించుట చాలాఘోరముగానున్నది-తననిర్ణయమును ఎట్టిభారముగాని మరేదిగాని చలింపచేయరాదని వారికోరిక,

నేను గ్రహించగలిగినంతవరకు ఈనిరశనదీక్షయందు రాజకీయమైన అంతరార్థమేమియులేదు- నిరశనదీక్ష మానబడువరకు వారలవిషయము నాలోచించనిరాకరించుట క్రూరమైన పొరపాటు. శ్రీజయప్రకాశు గారిని, వారితోడిఖైదీలను ప్రాణోపద్రవము కలుగునంతవరకు ఆశ్రయించుట అమానుషచర్యయగును. వెంటనే ఆ డిటెన్యూల కోరికలుతీర్చుట మానుషధర్మమని నేను ప్రభుత్వమువారికి విన్నవించుచున్నాను- రాష్ట్రప్రభుత్వము లకోరికలు కనుగొని వాటిప్రకారమాచరించెదననుట న్యాయమైనమాటకాదు, సరియైనమాటకాదు-సౌఖ్యవిషయము, స్వాతంత్ర్యము ముఖ్యమగు విషయములలో కేంద్ర ప్రభుత్వమువారు రాష్ట్రప్రభుత్వముల కోరికలప్రకారము చేయవలసినవిధిలేదు. రాష్ట్ర ప్రభుత్వములు డిటెనూలను తమరాష్ట్రములలో ఉంచుకొనుటకు భయపడుచున్నచో, ఏదో సంపూర్ణముగా తప్పైనది ఉండవలెను.

ఈవిధముగా నిరశనదీక్ష సాగుచుండుటజూడ శాసనోల్లంఘనపు ఖైదీలను విడుదలచేయుట వ్యర్థమనిపించుచున్నది-వారలు తమంతటతామే జైలుకుపోయినట్టివారు- తమంతటతాము జైలుకుపోకున్నను, న్యాయస్థానవిచారణ లేకుండ బంధించియుంచబడినవారలు అటులేయుండి, ప్రతిమానవునికి ఉండవలసిన కనీసపు సౌకర్యములకై నిరశనదీక్షబూనియున్నపుడు, ఈశాసనోల్లంఘనపు ఖైదీలు ఏమొగముపెట్టుకొని బయటికిరాగలరు?

---

కొందరు పత్రికలలో ఆక్షేపించియున్నారు,-కాని లెక్కలను పరిశీలించినతర్వాత యథార్థమును అవి సాధ్యమైనంత సరిగా తెలుపుచున్నట్లు తెలియగలదు. రాష్ట్రముల నేర్పరు లెక్కలు ౧౯౪౨ మార్చిలోగా అచ్చుఅయియుండగలవు. భారతదేశము మొత్తపులెక్కలకు రాష్ట్రముల నుండివచ్చెడి లెక్కలపై ఆధారపడవలెనుగదా యున్నను, వాటినికూడ అదేతేదివాటికి ప్రచురించవీలగునని ఆశతోనున్నారని ప్రభుత్వప్రతినిధి సమాధానమిచ్చెను. ఈజనపరిగణనకై మొత్తము ౭౬ లక్ష ౨౦వేల రూపాయిలు ఖర్చుఅయినవనిరి.

---



## క్రొత్తరాజ్యాంగ సంస్కరణల కమిషనుపని యేమి?

నవంబరు౧౮వతేదీన భారతశాసనసభ రెండవశాఖయగు కౌన్సిల్ ఆఫ్ స్టేటు సమావేశమందు ఇపుడుదేశములో రాజకీయముఖ్యులందరివద్దకు పోయితిరుగుచు అభిప్రాయములను సేకరించుచున్న రాజ్యాంగసంస్కరణలకమిషనయగు హాడ్సన్‌గారిపనినిగురించి చాలవినోదకరముగ ప్రశ్నోత్తరములువడచినట్లు "హిందూ" పత్రికయొక్క విశేషవిలేఖరిపంపినవార్తలో నున్నది-ప్రశ్నలకు రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరిగారు సమాధానమిచ్చుచు, ఆకమిషనరుగారు రాజ్యాంగసంస్కరణ అనుగుణించిన ప్రతివిషయమును పరిశీలించుచున్నారనిరి, కాని ఆకమిషనరు నేరుగా వైస్రాయిగారికిలోబడియుండుఅధికారి గావున,ఆయన పరిశీలించినకొన్ని విషయములను కేంద్రశాసన సభవారికి తెలియుబరచుటకు వాగ్దానమొసగ వీలులేదనిరి.

వైమర్ కమిషను, జాయింటు పార్లమెంటరీ కమిటీవారలు ఈసంస్కరణల విషయములలో చేసినపనియంతయు వ్యర్థముచేయుబడు యను అంతోళనతో పి.యన్. సప్రూ అనుసభ్యుడు హాడ్సన్ గారిపనిపైచెప్పిన రెండుకమిటీలవారలును చేసిన పనికి దానితర్వాతచేర్చవలసిన దానిని చేర్చుట మాత్రమేయనియు ఆసాటులో హాడ్సన్ గారు కర్తలనుబట్టి రాజ్యాధికారుల నెన్నుకొనుపద్ధతికిని గవర్నరుల అధికారములు వంశపారంపర్యముగా సంక్రమించుచుండుపద్ధతికిని అనుకూలములైనఅభిప్రాయములను సేకరించుచుండుటలేదనియు మాటనొసగవలసినదని కోరిరి-కాని సర్ అక్బర్ హైదరిగారు మొదటచెప్పినదానికంటె ఎక్కువచెప్పజాలనిరి. అంతుపై కుంజ్రూగారు భావిరాజ్యాంగసంస్కరణములు కేవలము వైస్రాయిగారికిని ఇండియామంత్రిగారికిని సంబంధించిన విషయములుమాత్రమేనా యనియు, వాని ఇండియాప్రభుత్వమువారి విషయములలోచేర్చక వైస్రాయిగారి ప్రత్యేకాధీనములో ఎందుకుంచినారనియు అడిగిరి.

---

### అమెరికా ప్రాంతాలవెలుపలికి అమెరికను సేనలు

అమెరికాసంయుక్తరాజ్యము దు కాంగ్రెసు వారితో సైనికదళములలోనివారలను యుద్ధశాఖాధికారులు "మీకుఅమెరికా ప్రాంతాలవెలుపలికిపోయి పనిచేయుటయిష్టమేనా అనిఅడిగినట్లు ఒకవార్తవచ్చినది-

